# పెదముత్తేవి క్షేత్రమాహాత్మ్యము



గ్రంథకర్త :

ముత్తేవి శ్రీరంగాచార్యులు
శ్రీ లక్ష్మీపతిస్వామివారి ఆలయ ట్రస్టుబోర్డు మెంబరు

ప్రచురణ :
శ్రీ లక్ష్మీపతిస్వామివారి దేవస్థానము
పెదముత్తేవి : కృష్ణాజిల్లా

# మనవి

భక్తులకు నిత్యపారాయణకొరకు ఈ క్షేత్రవాసి శ్రీ లక్ష్మీపతిస్వామివారి మీద శ్రీ శ్రీ శ్రీ (1008) సీతారామ యతీంద్రులవారున్నూ వంగల సుబ్రహ్మణ్య కవిగారున్నూ రచించిన సుప్రభాతములు కూడ ఈ గ్రంథములో చేర్చి ప్రచురించియున్నాము. సర్వులును ఉపయోగము పొందుదురని ఆశించుచున్నాము.

పెదముత్తేవి
10-1-1978

వర్రా వెంకటరత్నం.
శ్రీ లక్ష్మీపతిస్వామివారి ట్రస్టుబోర్డు
అధ్యక్షుడు

# సమర్పణ

మా ముత్తేవి వంశీయు లెల్లరకు తరతరాలుగా పరమార్థ మనుగ్రహింప వరం బొసంగి, సత్యాలను అనవరతము కంటి రెప్పవలె కాపాడుచు, మా గ్రామ వాసుల ఇలువేల్పుగా వెలుగొందుచున్న పెదముత్తేవి క్షేత్రవాసి శ్రీ లక్ష్మీపతిస్వామివారికి- "ఉడుతా భక్తిగా -

— గ్రంథకర్త.

# వి ష య సూ చి క

ఆలయ తొలిస్థానాచార్యులు,

ఓరియంటల్ హైస్కూలు సంస్థాపకులు



శ్రీ శ్రీ శ్రీ (1008) సీతారామ యతీంద్రులవారు

ఆలయ స్థానాచార్యుల,
హెరిడిటరీట్రస్టీ పదవులను కెంటినీ ప్రస్తుతము
నిర్వహించుచున్న



శ్రీ శ్రీ శ్రీ లక్ష్మణయతీంద్రులవారు

# వినతి

అష్టాదశపురాణములు, బ్రహ్మసూత్రములు రచించి భూలోకవాసులకు జ్ఞానభిక్ష పెట్టిన విష్ణ్వంశ స్వరూపులు శ్రీ వేదవ్యాసులు పెదముత్తేవి క్షేత్రాన్ని వరించి, ఇచ్చట కొంతకాలము తమ తపోదీక్షను కొనసాగించి యున్నారు. ఆ తరుణములో వారి నిత్య ఆరాధనకై వైకుంఠములోని నారాయణమూర్తి ఈ క్షేత్రమునకువిచ్చేసి స్వయంవ్యక్తముగా వెలసిరి.

శ్రీస్వామివారిని నేడున్న ప్రాంతములో క్రీ. శ. 1620 సంవత్సరములో ముత్తేవి పేరంరాజుగారు అను భక్తశిఖామణి ప్రతిష్ఠించిరి. భగవదనుభవము పొందిన పలువురు మహాభక్తులు పరంపరగా వీరివంశంలో జన్మించిరి. 18 వ శతాబ్దిలో భద్రాద్రిలో నిండుగోదావరినుండి విష్వక్సేనులను పిలిచి తెప్పించి, అసఫ్‌జాహీవంశీకులకు శాపమిడిన ఆంధ్ర నమ్మాళ్వార్లు పెరుమాళ్ళయ్యగారు, చల్లపల్లికోటను, నిజామ్‌నవాబ్ దాడి నుంచి సంరక్షించిన వారి మనుమలైన పెరుమాళ్లయ్యగారు, తమ పాండిత్య ప్రకర్షచే దక్షిణావని యంతయు దిగ్విజయము చేసిన సుందరరామదాసుగారు 20 వ శతాబ్దిలో అపరచైతన్యులుగా, వినుతి కెక్కిన శ్రీ సీతారామయతీంద్రులవారు మొదలగు భక్తులెందరో వీరి వంశీకులే. వీరందరు ఈ క్షేత్రవాసి అయిన శ్రీలక్ష్మీపతిస్వామివారి మీదను, భద్రాద్రి శ్రీ సీతారాముల

వారి మీదను, శ్రీకాకుళములోని శ్రీకాకుళేశ్వరస్వామివారి మీదను పలు కీర్తనలు రచించిరి. అవి అన్నియు భక్తిరస గుళికలు అగుటచే నేటికిని పలు ప్రాంతములలో అధ్యాత్మ రామాయణ కీర్తనలవలె భజనపరులు వీటిని గానము చేయు చున్నారు. వీటిలో కొన్ని విజయవాడ రేడియో కేంద్రమునుండి కూడా పలుమారులు ప్రసారమగుచున్నవి.

మహాభక్తులైన పేరమరాజు వంశీకులతో పాటు నారాయణతీర్థులుకూడా ఈ క్షేత్రాన్ని దర్శించి ఇచ్చట కొంత కాలము నివసించియుండిరి. అధ్యాత్మరామాయణ కీర్తనలు రచించిన శ్రీ శేషగిరి సుబ్రహ్మణ్యము కూడా ఈ క్షేత్రములో జన్మించిరి.

పేరమరాజు వంశీకులు రచించి ప్రజాదరణ పొందిన కీర్తనలు అన్నింటిలోను ఈ క్షేత్రవాసిని వేనోళ్ల నుతించుచు శ్రీకాకుళములోని కాకుళేశ్వరులు, భద్రాద్రిలోని సీతారాములు, ఈ క్షేత్రములోని లక్ష్మీనృపతిస్వామి వీరుముగ్వురును, ఏకరూపులే అని వర్ణింపబడియున్నది. శ్రీకృష్ణదేవరాయలు, తన ఆముక్త మాల్యదలో శ్రీకాకుళములోని కాకుళేశ్వరుడు తిరుమల వేంకట రమణుని ప్రత్యక్షరూపమని వర్ణించియుండిరి. కాన ఈ క్షేత్రములోని శ్రీలక్ష్మీనృపతిస్వామి సాక్షాత్తు తిరుమలలోని వేంకటరమణుని ప్రత్యక్షరూపమని నిర్ణయమగుచున్నది. వీరి ఉభయుల నిజరూపును (అలంకారములన్నియు తీసివేసినప్పుడు సేవించు రూపము) దర్శించినచో ఉభయులు పోలికలు ఏక రూపముననే ఉండుట గమనించగలము.

1959 లో సంభవించిన అష్టగ్రహకూటమిలో శ్రీ సీతారామ యతీంద్రులవారు లక్ష్మీపతిస్వామివారి ఆలయములో 108 దినములు అహోరాత్రములు నిర్వహించిన హరినామ యజ్ఞములో వేనకువేలు ప్రజానీకము పాల్గొని స్వామివారి లీలలు ప్రత్యక్షముగా తిలకించి ధన్యులైనారు. మూలవిరాట్టు చెంతను, హనుమంతుని నృత్యము, ఓంకారనాదమునంటి ఆ నాటి కొన్ని ప్రత్యక్షలీలలు పరమనాస్తికులకు కూడా కనువిప్పు కలుగజేసినవి.

"ఈ గ్రంథము గత దసరానాటికే ప్రచురించదలచి ఆలయ స్థానాచార్యులవారు అయిన శ్రీ సీతారామ యతీంద్రులవారు, డిప్యూటీకమీషనర్ రాజుగారల అభిప్రాయములు సేకరించితిమి. కాని అనివార్య కారణములవల్ల ప్రచురణ ఆలస్యమైనది. ఈ లోగా సీతారామయతీంద్రులవారు మమ్ములనందరిని దుఃఖసముద్రములో ముంచి స్వర్గస్థులగుట సంభవించినది. శ్రీవారి పిమ్మట ట్రస్టుబోర్డు లక్ష్మణ యతీంద్రులవారిని స్థానాచార్యులపదవి స్వీకరించమని కోరినందున ఆ వివరములుకూడా చేర్చియుంటిని."

ఈ దివ్యక్షేత్ర మాహాత్మ్యము చదివినవారికి స్వామివారిని సేవించినవారికిని, స్వామివారి ఆశీస్సులు తప్పక లభించగలవు. కాన ఆస్తిక మహాశయులెల్లరు ఈ క్షేత్రము సందర్శించి తరించగలరని ఆశించుచున్నాను.

ఇట్లు బుధజనవిధేయుడు,

పెదముత్తేవి
1-1-78

ముత్తేవి శ్రీరంగాచార్యులు
గ్రంథకర్త

# ఆశీస్సు

## శ్రీ శ్రీ శ్రీ సీతారామ యతీంద్రులు

మమక్షుజన మహాపీఠాధిపతులు

శ్రీరస్తు చిరంజీవి ముత్తేవి శ్రీరంగాచార్యులను ప్రేమపూర్వక నారాయణ స్మరణములతో ఆశీర్వదించి వ్రాయునది.

పెదముత్తేవి క్షేత్రవాసి శ్రీ లక్ష్మీపతిస్వామివారికిని ఆ గ్రామములోని 'ముత్తేవి' ఇంటిపేరుగల బ్రాహ్మణకుటుంబీకులకునూ అనాదిగా ఉన్న అవినాభావ సంబంధమును పురస్కరించుకొని క్షేత్ర మాహాత్మ్యముతోపాటు, ముత్తేవి వంశజుల చరిత్రకూడా చరిత్రాధారములతో సమగ్రముగా రచించవలసినదిగా నేను నీకు సలహా ఇచ్చియుంటిని.

పలు పత్రికలకు సంపాదకుడుగా నుండుటయే గాక, రేడియో ప్రసంగములవలనను ప్రముఖ పత్రికలకు విమర్శన పూర్వకమైన వ్యాసములద్వారాను నీ వొనరించిన సారస్వత సేవ ఆంధ్రులెల్లరు ఏనాడో గుర్తించిరి. నీ సామర్థ్యము గుర్తించుటచే ఈ రెండు గ్రంథములు రచించు కార్యభారము వహించమని నా అభిలాషను వ్యక్తీకరించితిని. నాయందు నీకుగల అభిమానముచే ఎన్నోకష్టములకు వ్యయప్రయాసలకు ఓర్చి స్వల్పవ్యవధిలో సర్వసమగ్రముగా రెండు గ్రంథములు పూర్తి చేసినందులకు నా హృదయపూర్వకమైన ఆశీస్సులు.

క్షేత్ర మాహాత్మ్య గ్రంథము ఆదినుంచి, చివరవరకు నీవు చదువగా వింటిని. ఎంతో ఆనందమైనది. చాలా బాగున్నది. ముఖ్యంగా వ్యాసుని నుండి శాలివాహన చాళుక్య చోళ కాకతీయ చక్రవర్తుల కాలములో స్వామివారి వైభవమును చరిత్రాధారములతో నిరూపించి ధన్యుడవైతివి. శ్రీ లక్ష్మీపతి స్వామి నీకు ఆయువు, ఆరోగ్యము, సిరిసంపదలు భక్తి జ్ఞాన వైరాగ్యములు ప్రసాదించుగాక !

నీవు రచించిన ముత్తేవి వంశజుల చరిత్ర అను ద్వితీయ గ్రంథము వ్రాయుటకు తొలిగా మీ నాయినగారు పూనుకొని పూర్తిజేయుట జరుగలేదు. వారిని పరమాత్మ అతితొందరలో తమ సన్నిధికి పిలిపించుకొన్నారు. ఆ గ్రంథము పూర్తిచేయుట ద్వారా నా కోరిక నెరవేర్చుటేగాక మీ నాయినగారి అభీష్టముకూడా నెరవేర్చి పితృఋణమును తీర్చుకొని ధన్యుడవైతివి. నీ ద్వితీయగ్రంథముకూడా త్వరలో ముద్రణ అయి ఆంధ్రుల కరకమలములను అలంకరించవలెనని నా అభిలాష. ఆ భారము నేనే వహించదలచితిని. నా అభిలాషను త్వరలో నెరవేర్చవలసినదిగా శ్రీ లక్ష్మీపతిస్వామివారికి నా ప్రార్థన. ఆయన నా ప్రార్థన తప్పక నెరవేర్చునని నా నమ్మకము.

ఇట్లు,

సదా మీ మేలుకోరు,

సీతారాం.

పెదముత్తేవి
24-9-72

# అభినందనము

## శ్రీ టి. యస్. యస్. నారాయణరాజుగారు

ఎండోమెంట్సు డిప్యూటీ కమీషనర్ - విజయవాడ.

ఆంధ్రదేశములో కనబడు పుణ్యక్షేత్రములందలి దేవాలయములు మహాపురుషుల తపస్సువలన ఆవిర్భవించి ఉదారులగు దాతల దాతృత్వముచే సంపన్నములైనవి. ఇట్టి పుణ్యక్షేత్రములలోనిదే యీ పెదముత్తేవి క్షేత్రము. ఇందలి శ్రీ లక్ష్మీపతి ఆలయమునందు ప్రతిష్ఠింపబడిన శ్రీలక్ష్మీపతి విగ్రహమునందలి శిల్పచాతుర్యము విశిష్టమైనది. ఒకే సాలగ్రామ శిలయందు శ్రీ లక్ష్మీ నారాయణులు అత్యంతరమణీయముగ కనబడుట విశేషము. ఇట్లు శిల్ప సౌందర్యముతో నిర్మింపబడిన విగ్రహము గోదావరి జిల్లాలోని ర్యాలిక్షేత్రమునందలి మోహినీ కేశవస్వామి విగ్రహమును శ్రీ డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు ఆంధ్రదేశము శిల్పములకు "మణిపూస" యని నుడివిరి. పెదముత్తేవియందలి శ్రీలక్ష్మీపతి విగ్రహము బహుశః వారి దృష్టినాకర్షించి యుండక పోవచ్చును.

పరమ పావనములగు కృష్ణాగోదావరీనదుల యొడ్డుననే అనేకములగు పుణ్యక్షేత్రములు, దేవాలయములు వెలసి విలసిల్లుచున్నవి. కృష్ణానదీతీరమునందు పంచనారాయణ క్షేత్రములలో పెదముత్తేవిక్షేత్రము గణనీయమైనది. శ్రీవేద

వ్యాసమహర్షి యిచట భీమరక్షకక్షేత్రమున తపస్సునాచరించుచు శ్రీ లక్ష్మీనృహరిని ప్రతిష్ఠ చేయుటచే, యిది ఆర్ష క్షేత్రము పరాయి శత్రువులు ఆంధ్రదేశముపై దండెత్తినపుడు ఆలయము పడగొట్టబడినను ఇందలి విగ్రహములు మాత్రము సమీపము నందలి పేరంరాజు తటాకమునందు నిగూఢముగా రక్షింప బడినవి. తరువాత విష్ణుభక్తుడగు పేరంరాజుగారికి స్వప్నము నందు శ్రీలక్ష్మీనారాయణులు కనబడి తమ యునికిని నిరూ పించగా శ్రీపేరంరాజు (పెరుమాళ్ళయ్య) పునఃప్రతిష్ఠగావించి ఆలయమును నిర్మింపజేసి శ్రీస్వామివారి ధూపదీపనైవేద్యా లకు వలయు సౌకర్యములను కలుగజేసిరి. వీరు మొదట ఆరువేల నియోగిబ్రాహ్మణులు. విష్ణుభక్తులగుటచే తరువాతను సంపూర్ణ మగు వైష్ణవమతమును స్వీకరించి వైష్ణవనామమగు పెరుమాళ్ల య్యగా ప్రసిద్ధి గాంచిరి.

వీరి వంశీయులు వైష్ణవమతప్రచారకులు శ్రీకృష్ణాశ్రమ ప్రతిష్ఠాపకులు జగద్వంద్యులునగు శ్రీసీతారామయతీంద్రులవారు ఈ స్థల పురాణమును వ్రాయ శ్రీముత్తేవి శ్రీరంగాచార్యులు వారిని ప్రోత్సాహించి మారుమూలనున్న యీ దివ్యక్షేత్రమును వెలుగులోనికి తీసుకొని వచ్చుట యెంతయు ప్రశంసనీయము.

ఇందులకు వారికి నా నమస్కారములు.

విజయవాడ
30 - 9 - 72

టి. యస్. యస్. నారాయణరాజు
డిప్యూటీ కమీషనరు, ఎండోమెంట్సు.

# శ్రీ లక్ష్మీపతి సుప్రభాతము

రచన

## శ్రీ శ్రీ శ్రీ సీతారామ యతీంద్రులవారు

ముత్తీవివంశ సుకృతాంబుధి పూర్ణచంద్ర !
భక్తార్తి భంజన ! మునీశ్వరవందితాంఘ్రే !
దేవాదిదేవ ! మహనీయ ! దయాపయోధే !
లక్ష్మీపతే ! మధురిపో ! తవ సుప్రభాతమ్ ॥ 1

బ్రహ్మాది దేవనికరా భయ భక్తియుక్తాః !
ద్వారాగ్ర సీమ సితబాహుపయోజ వారాః !
త్వద్దర్శనాతురమనా భవతాం స్తువంతి !
లక్ష్మీపతే ! సురవిభో ! తవ సుప్రభాతమ్ ॥ 2

స్వామిన్ ! హరే ! సకలలోకశరణ్యమూర్తే !
సంసారవారిధిసముత్తరణైకహేతో !
బ్రహ్మాదినిర్జరవరార్చితపాదపద్మ !
లక్ష్మీపతే ! సురవిభో ! తవ సుప్రభాతమ్ ॥ 3

వేదాంతవేద్య ! విధిరుద్రనుతప్రభావ !
ముత్తీపివంశకమలావలి బాలసూర్య !
మాం పాహి ! పాహి ! కరుణాజలధే ! మురారే !
లక్ష్మీపతే ! సురవిభో ! తవ సుప్రభాతమ్ ॥ 4

క్షీరాబ్ధిజాననపయోరుహమత్తభృంగ !
పాదాశ్రితావన ! హరే ! కరుణాంతరంగ !
లోకప్రమాదకరదానవ గర్వభంగ !
లక్ష్మీపతే ! మురవిభో ! తవ సుప్రభాతమ్ ॥ 5

వ్యాసాదిదివ్యఋషివర్గనుతప్రభావ !
కల్యాణదివ్యగుణవైభవవారిరాశే !
పాహి ప్రభో ! మురవిభో ! శరణార్థికల్ప
లక్ష్మీపతే ! మధురిపో ! తవ సుప్రభాతమ్ ॥ 6

నారాయణాచ్యుత ! జనార్దన ! వాసుదేవ !
బ్రహ్మాదిముఖ్య సురపూజితపాదపద్మ !
ముత్రివి వంశ పరిరక్షక ! శ్రీనివాస !
లక్ష్మీపతే ! మురవిభో ! తవ సుప్రభాతమ్ ॥ 7

సంసారదుష్ట ఫణిఘోర విషాగ్ని హోత్ర
సంపీడ్యమానభయకంపితమానసోఽహమ్
తం మాం శ్రితం కరుణయైవహి రక్ష ! రక్ష !
లక్ష్మీపతే ! మురవిభో ! తవ సుప్రభాతమ్ ॥ 8

వ్యాసాది దివ్యఋషిసంహతినాథబృందాః
తిష్ఠంతి భక్తివివశా స్తవ దర్శనార్థమ్
ఉత్తిష్ఠ ! భక్తజన పాలక ! పారిజాత !
లక్ష్మీపతే ! మురవిభో ! తవ సుప్రభాతమ్ ॥ 9

రాజాధిరాజ ! చరణాశ్రితకల్పభూజ !
పాషండవాదతమసశ్శ్రిత భానుతేజ !
బ్రహ్మాదినిర్జరవరైః కృత పాద పూజ !
లక్ష్మీపతే ! మధురిపో ! తవ సుప్రభాతమ్ ॥ 10

తే సుప్రభాత మఖిలాశ్రయ సుప్రభాతం
దామోదరాచ్యుత ! హరే ! నత పారిజాత !
వేదాంతవందితలసత్పదవారిజాత !
లక్ష్మీపతే ! సురవిభో ! తవ సుప్రభాతమ్ ॥ 11



# శ్రీ లక్ష్మీపతి సుప్రభాతము

రచన

శ్రీ వంగల సుబ్రహ్మణ్యశర్మగారు

శ్రీసేవి తాంఘ్రి సరసీరుహ ! దేవదేవ !
ముక్తివాస ! పరమేశ ! రమేశ ! ఈశ !
లోకోన్నతిం వితను తే౽వన తేన మూర్ధ్నా
లక్ష్మీపతే! సురవిభో ! తవసుప్రభాతం ॥ 1

లక్ష్మీశిరోజ విలుఠద్గిరి మల్లికాభాః
కష్ణానదీజల సముల్లుప్త మత్స్యభాసాః ।
తారాస్సమస్త జగతీ కలహంసమాలాః
లక్ష్మీపతే! సురవిభో ! తవసుప్రభాతం ॥ 2

వాతాః ప్రశాంతసుఖ సౌరభ వీచిమాలాః
నిశ్వాసపూర్ణ విమలాః కమలాలయాయాః ।
కృష్ణానదీజలతరంగ సుశీకరార్ద్రాః
లక్ష్మీపతే! సురవిభో! తవసుప్రభాతం ॥ 3

కళ్యాణ భావ భరితాః నిభృతానురాగాః
లక్ష్మీకటాక్ష సదృశ ప్రవిభాసమానాః
బాలార్కరశ్మి నిచయాః భువి భాన్తివిష్టాః!
లక్ష్మీపతే! సురవిభో! తవ సుప్రభాతం ॥ 4

త్వద్భక్తి పూర్ణ చరితార్థ సమస్తలోకః
వృక్షాలతాశ్చ సరితశ్చ చరాచరాత్మన్ !
సర్వం త్వదీయ విమల ప్రతిబింబమాసీత్
లక్ష్మీపతే! సురవిభో! తవసుప్రభాతం ॥ 5

నిద్రాంధకార వినిమగ్న సమస్తలోకః
ఉన్నిద్ర ఆస భవదీయ కృపానురూపైః!
బాలార్క రశ్మి భిరిహా ప్రవిబోధ్యమానః!
లక్ష్మీపతే! సురవిభో! తవసుప్రభాతం ॥ 6

వృక్షాః పతత్రిగణ సంకులరావ పూర్ణాః
నద్యో వినిర్మల పవిత్ర జలప్రవాహాః ।
ఆశాశ్చ శాంతమృగభీకర చారగర్జాః
లక్ష్మీపతే! సురవిభో! తవ సుప్రభాతం ॥ 7

పద్మాలయా మధుర మంజుల భావరక్తాః
బాలార్క దీధితి కరాః హృదయానుషక్తాః ।
మూర్తింతవేవ పరితో జగదత్ర భాన్తి
లక్ష్మీపతే ! సురవిభో ! తవ సుప్రభాతం ॥ 8

మోహాంధకార గజకుంభ విదీర్ణ లబ్ధాః
ముక్తాః నభఃస్థల విరాజిత జాతిహీరాః !
రాజన్నిరాజ భవనేష్వివ తత్ర తారాః
లక్ష్మీపతే ! సురవిభో ! తవ సుప్రభాతం ॥ 9

మోహాంధకార మపనుద్య విశాల విశ్వే
స్వాత్మ ప్రకాశన పర స్తవ మూర్తిధారీ !
విద్యోత్యయం విబుధ వందిత కర్మసాక్షీ
లక్ష్మీపతే ! సురవిభో ! తవ సుప్రభాతం ॥ 10

త్వద్ఘ్రాణ ధూప సదృశం విమలాంతరిక్షం
నీరాజనం మిహిర భాను సమూహ రాశిః ।
కుర్వంతి తే సురవరా ననునిత్యపూజాం
లక్ష్మీపతే ! సురవిభో ! తవ సుప్రభాతం ॥ 11

కాషాయవర్ణ పరిధాన శివస్వరూపః
త్వత్పూజనాయ సముదేతి సహస్రరశ్మిః ।
తేనాఖిలం జగదనంత విశేష భాసం
లక్ష్మీపతే ! సురవిభో ! తవ సుప్రభాతం ॥ 12

బ్రహ్మాది శిష్యవర సంతతి రర్థ్యవర్యైః
ఓంకారపూర్వ మధునాద సుఖాప్తిభూతైః ।
సూక్తైః స్తవం వితనుతేత్వయి భక్తియుక్తైః
లక్ష్మీపతే! సురవిభో ! తవ సుప్రభాతం ॥ 13

అభ్రాణిదైత్య పటలా ఇవయాన్తి భీత్యా
లక్ష్మీశిరస్థ ఇవ నూతన పద్మరాగః ।
బాలార్క ఉద్యమతి సంప్రతి దివ్యశోభాం
లక్ష్మీపతే ! సురవిభో ! తవ సుప్రభాతం ॥ 14

త్వత్పూజనాయ సముపాగత దివ్యకాంతా
సీమంత కుంకుమ విభాసిత మంతరిక్షం
లక్ష్మీహృదంతర విరాజిత రాగరూపం
లక్ష్మీపతే ! సురవిభో ! తవ సుప్రభాతం ॥ 15

లక్ష్మీసతీ వదన సంధృత కుంకుమశ్రీ
ర్భాను ర్విరాజతిచ, రాగమయంచవస్త్రం ।
బాలార్క దీధితి రివ ప్రవిభాతి దివ్యం
లక్ష్మీపతే ! సురవిభో ! తవ సుప్రభాతం ॥ 16

మోహాంధకారపటలం వినిపీయ సర్వం
ఆయాతి భాను రిహ పూర్వదిశః ప్రయాతః ।
చైతన్యయుక్త మభవ జ్జగదేవ సర్వం
లక్ష్మీపతే ! సురవిభో ! తవ సుప్రభాతం ॥ 17

విష్ణో! కృపాజలనిధే! ధృతమర్త్యరూప !
నిర్ధూత సోమకమహాసుర ! లోకబంధో !
గోవింద ! నిర్జరవరార్చిత పాదపద్మ !
లక్ష్మీపతే! సురవిభో ! తవ సుప్రభాతం ॥ 18

లక్ష్మీపవిత్ర హృదయాబ్జ సహస్రరశ్మే !
మోహాబ్ధి సంతరణయాన ! కృపైకసింధో !
హే సూర్యచంద్రనయన ప్రవిభాసమాన !
లక్ష్మీపతే! సురవిభో ! తవ సుప్రభాతం ॥ 19

హే అంజనాద్రి శిఖరాగ్ర పరీతశోభ !
నీలోత్పలామల ! సురేశ ! ఖగేశవాహ !
వక్షో విరాజిత రమ ! ప్రణయైకసింధో !
లక్ష్మీపతే ! సురవిభో ! తవ సుప్రభాతం॥ 20

రాత్రౌ సుఖప్రణయమంజుల చారులీలా
లక్ష్మీశిరోజ లులితా ఇవకుందజాతాః
తారా అపాస్త నిజకాంతి ముఖావతారాః
లక్ష్మీపతే ! సురవిభో ! తవ సుప్రభాతం॥ 21

ప్రాగద్రిశృఙ్గ మధిరుహ్య సహస్రరశ్మిః
విభ్రాజతే నిజవధూస్ఫుట పద్మరాగః ।
ఆయాతి రాగమయదీప్తికరాన్ వికీర్ణన్
లక్ష్మీపతే ! సురవిభో ! తవ సుప్రభాతం॥ 22

ప్రాతః పవిత్ర సముదయోదిత సూర్య ఏవ
బ్రహ్మాస్త్వయం సముపగత్య తవాంఘ్రిపద్మే ।
భక్త్యా నతిం వితనుతేఽవనతేన మూర్ధ్నా
లక్ష్మీపతే ! సురవిభో ! తవ సుప్రభాతం॥ 23

భర్త్రీ త్వదంఘ్రి పరిసేవన జాతబుద్ధిః
వాణీవరాజతి శరన్నవమేఘరేఖా ।
తౌ దంపతీ స్వయముపాగమతాంగృహాంతే
లక్ష్మీపతే ! సురవిభో ! తవ సుప్రభాతం॥ 24

దేవాపకారి దితిపుత్ర వినాశనాయ
త్వత్ప్రేషితం తవ సుదర్శననామ చక్రం ।
ఆభాతి సూర్య ఇవ రక్తిమవత్తులసన్
లక్ష్మీప ! సురవిభో ! తవ సుప్రభాతం॥ 25

పల్లీగృహేషు దధి మంథన మంజరావాః
నిర్యాన్తి తే ప్రణవనాద సుధాతరంగాః ।
అంభారవాశ్చ విలసన్త్యయి వత్సకానాం
లక్ష్మీపతే ! సురవిభో ! తవ సుప్రభాతం॥ 26

స్వస్తిప్రభో ! సురవరేశ్వరవంద్య ! దేవ !
దేవాదిదేవ ! ధృతదివ్య దశావతార !
వైకుంఠవాస ! సుజనావన బద్ధదీక్ష !
లక్ష్మీపతే ! సురవిభో ! తవ సుప్రభాతం॥ 27

శ్రీ శ్రీ శ్రీ

ఓం తత్సత్

శ్రీ రాజ్యలక్ష్మీ పరదేవతాయైనమః

# చరణం

క్రమసముదాగత మందర శీతలమారుత సౌరభమంగళతా
ప్రకృతి వధూకృతమంజుల భాస్వరభావన పేశలతా విరతా ।
నవమధుకోకిల కూజితకుంజిత సర్వహృదంతర మంథరతా
తవ చరణే జగదంబ ! పరిప్లవతే, మమ చిత్తమతో రమతే ॥

నవనవపత్ర సముద్భవరాగ విశేష సముల్లసదంతరతా
నవనవమేఘ హృదంతర జాతకృపారస భావపరిస్ఫురతా ।
నవనవమేఘ వినిర్గత విద్యుదతీవ విడంబిత భాస్వరతా
తవ చరణే జగదంబ! పరిప్లవతే, మమ చిత్తమతో రమతే ॥

సుమమధుసంస్కృతి సంభృతసంభవ సౌరభవీచి ధళద్ధళతా
దినకర భాను సహస్రసమంచిత పాదనఖోజ్వలతా భరతా ।
జలరుహరాగ సమావృత సౌరభ భారవిలాసగతిస్ఫురతా
తవ చరణే జగదంబ! పరిప్లవతే, మమ చిత్తమతో రమతే ॥

# వదనం

శశధరకోటి సమాగతకాంతి పరీవృతశాంత వినిర్మలతా
పరమ తపఃఫల లబ్ధసురద్రుమ బృంద పరీమళమంజులతా !
అమరనదీజలసిక్త మరుత్వరి సేవితశాంత హృదంతరతా
తవ వదనే జగదంబ పరిప్లవతే, మమ చిత్తమతో రమతే !

జలద వ్యూదంతర సంభృత నీరస తైశ కృపాసహితాంతరతా
మధుసహాకార పరిమళ బృంహిత దివ్య ఘుమంఘుమ మేదురతా ।
అమర తరు ప్రసవ ప్రతిమానరుచి ప్రకరాంచిత కోమలతా
తవ వదనే జగదంబ పరిప్లవతే, మమ చిత్తమతో రమతే ॥

ఓం తత్సత్

శ్రీ శ్రీ శ్రీ

# పెదముత్తేవి క్షేత్రమాహాత్మ్యము

పరమాత్మానుభవము పొందిన మహాత్ముల కోరిక ననుసరించిగాని లేక చేతనులను ఉద్ధరించ సంకల్పించుకొన్న తరుణంలోగాని పరమాత్మ భూలోకములో అర్చారూపములో వెలిసెదరు. ఆ అర్చారూపాన్ని స్వయంవ్యక్తమనియు ఆ క్షేత్రమును దివ్యదేశము అనియు శాస్త్రములు పేర్కొని యున్నవి. ఎన్నియుగాలు గడిచినా స్వయంవ్యక్తమై అర్చారూపములో వెలసిన పరమాత్మ విగ్రహాలు సర్వేసర్వత్రా శక్తివంతమై ఉంటాయి. ఆంధ్రావనిలో ఇలా తిరుపతి, భద్రాద్రి, శ్రీశైలము, మొదలైన దివ్యక్షేత్రాలలో వెలసిన దేవతా మూర్తులవలె కృష్ణాజిల్లాలోని పెదముత్తేవి క్షేత్రంలో వెలసిన శ్రీ లక్ష్మీపతిస్వామివారు కూడ ఆకోవకే చెందియున్నారు.

చరిత్ర పరిశోధకులు మనదేశ చరిత్రను చరిత్ర పూర్వ యుగము, చారిత్రిక యుగము అను రెండు యుగములుగ విభజించియున్నారు. ఈ రెండు యుగముల కాలనిర్ణయములో-వీరందరూ ఏకాభిప్రాయమునకు రాలేకపోయినా, పురాణ కాలములోనున్నా శాతవాహనులరాజ్యపాలనకు పూర్వకాల మున్నా దండకారణ్యము దక్షిణప్రాంతము నందంతటను వ్యాపించియుండెనని వీరందరూ ధృవపర్చియున్నారు. గాన ఈనాటి కృష్ణాజిల్లా పౌరాణిక యుగంలో అరణ్యప్రాంత

మగుటయే గాక కృష్ణానదీప్రాంతము, కృష్ణా-సాగర సంగమం కూడా అగుటచే పలువురు మహాఋషులకు ఆశ్రయం ఇచ్చింది. హంసలదీవిలో పరమహంసలు వెలుగొందగా నేటి రేపల్లె తాలూకాలోని మోరతోట ఆనాడు మునులతోటగా ప్రశిద్ధి గాంచెను. శ్రీకాకుళంలో అత్రి, చ్యవలూరులో చ్యవనుడు, అవనిగడ్డలో వశిష్టుడు, పెదముత్తేవిలో వ్యాసమహాఋషి యున్నూ తమ ఆశ్రమాలు నిర్మించుకొని ఆ యా ప్రాంతాలను పునీతం చేసిరి. ఈ మహాఋషులంతా తమ తపోదీక్షలను కొనసాగించిన ఈ ప్రాంతానికి దివిసీమ (స్వర్గసీమ) అను సార్థకనామం ఏర్పడింది.

పెదముత్తేవికి ఒక మైలు దూరంలోగల నేటి భీమనదీ ప్రాంతములో వ్యాసులవారు ఆశ్రమం నిర్మించుకొని పలు సం॥రములు తమ తపోదీక్షను ఇచ్చట కొనసాగించిరి. అర్జునుడు విజయవాడలోనున్న తరుణంలో భీముడు ఈ భీమనదీ ప్రాంతములో కొంతకాలముండెననియు వారు స్నానపానాదులుచేసిన ప్రదేశము ఒక ప్రవాహమై భీమనది అయినదనియు ఒక గాథ గలదు. ఈ స్మృతి చిహ్నంగా ఆ చెంతనే 15 మైళ్ళు విస్తరించు నట్లు బ్రిటిష్ ప్రభుత్వ దినములలో ఏర్పర్చిన పంట కాలువకు భీమనదీ ఛానల్ అను నామధేయము ఏర్పర్చుటయున్నూ జరిగినది.

## భూలోకములో శ్రీమహావిష్ణువు అవతరణ

ఇలా వేదవ్యాసులకున్నూ, భీమునకున్నూ స్థావరమైన నేటి పెదముత్తేవి వ్యాసమహాఋషికాలంలో ముక్తీవి అను నామధేయంతో గొప్ప క్షేత్రముగా విరాజిల్లి యుండెను. ముక్తి అనగా ముక్తిని ఈవి అనగా ప్రసాదించునది అనగా ముక్తిని ప్రసాదించే ప్రశిద్ధ క్షేత్రము. "మునీనాం అహం వ్యాసం" అని కృష్ణపరమాత్మ తానే వ్యాసుడనని గీతలో చెప్పుకొని యున్నారు గాన వ్యాస భగవానుల ఉనికిచే ఈ క్షేత్రానికి ఆనామధేయం ఏర్పడింది. "అహం భక్త పరాధీనః" అని శ్రీకృష్ణపరమాత్మ వచించియున్నందున వ్యాసభగవానుని ఆరాధనకై వైకుంఠంలోని శ్రీమన్నారాయణమూర్తి లక్ష్మీదేవితో కూడి ఇచ్చటకు వేంచేసి స్వయం వ్యక్తంగా భీమనది ప్రాంతములో వెలసిరి. ఇలా స్వయం వ్యక్తంగా ఈ క్షేత్రంలో వెలసిన స్వామిని లక్ష్మీనారాయణ, లక్ష్మీపతి అనియు అమ్మవారిని రాజ్యలక్ష్మి అనియు వ్యాసులవారు నామధేయములు ఏర్పర్చి యుండిరి. ఈ క్షేత్రంతోపాటు ఆనాడు నడికుదురు, అవినిగడ్డ, నల్లూరు, రాచూరు క్షేత్రాలతో కలుపుకొని పంచలక్ష్మీనారాయణ క్షేత్రాలు వినుతి కెక్కాయి. ఈ క్షేత్రాలకు ఆనాటిగల నామధేయములతో ఈ క్షేత్రముల వైభవము గూర్చి స్కాందము, సహ్యాద్రిఖండము, బ్రహ్మవైవర్తనమునందు వ్యాసులవారు విపులముగా వర్ణించి యున్నారు.

ఈ క్షేత్రములోని లక్ష్మీనారాయణ స్వామివారు వ్యాసులచే ప్రతిష్ఠించబడినట్లున్నూ ఆనాడు ఈ గ్రామము ముక్తిని క్షేత్రముగా భాసిల్లినట్లున్నూ అనాదినుంచియు నేటివరకు పరంపరగ అర్చన సమయంలో నిత్యం పఠింపబడు చున్న ఈ దిగువశ్లోకములవల్ల గూడ రూఢి యగుచున్నది.

శ్లో॥ నీలేందీవరసుందరం కటితటే - ప్రాలంబి హేమాంబరం
ధారోత్తుంగ రథాంగ మంగళ గదా-శంఖాసి హస్తాంబుజం
శ్రీమద్భ్రమనదీ తరంగనికటే - వ్యాసేన సంస్థాపితం
ముక్తివ్యాహ్వయపక్కణే స్థితమహం ధ్యాయామిలక్ష్మీపతిం.

శ్లో॥ క్షీరాంభోనిధి రత్నమండప మహా-సౌవర్ణ సింహాసనే
వామాంకస్థితయా హసన్వదనయా - శ్రీకాంతయాలింగితం
దోర్దండాంకిత శంఖ పంకజ గదా - చక్రాసి ధారాశ్రయం
త్వామిత్థం కలయామి జన్మ విధనం-లక్ష్మీశనారాయణం.

ఈ రెండు శ్లోకములు శ్రీ స్వామివారి పీఠముమీద వ్యాసులవారు వ్రాయించి యుండిరి. 14 వ శతాబ్దిలో ఆంధ్ర దేశములో ముస్లిముల భీభత్సం కొనసాగి వారి పాశవిక ప్రవర్తన పరాకాష్ఠ నందుకొన్న దినములలో వారు ఈ ఆలయమును నేలగూల్చుటయే గాక ఈ శ్లోకములను నామ రూపం లేకుండా చేసియున్నందున తదాది పీఠంమీద ఈ శ్లోకములు లుప్తమైపోయినవి.

## స్వామివారి శిల్పసౌందర్యము

శ్రీలక్ష్మీపతిస్వామివారికి ఎడమవైపున రాజ్యలక్ష్మీ అమ్మవారు వెలుగొందగా కుడివైపునగల హస్తపు బొటన వ్రేలిపై అతి రమణీయముగ ఒక శంఖం మోపుచేయబడి ఉన్నది. ఇంత బరువుగల శంఖం నఖాగ్రము మీద నిల్చి యుండుట ఆశ్చర్యము గొల్పుచుండును. శంఖము, లోన భాగము, పరీక్షించినచో ఈ కారణము తెలుసుకొనగలము. శంఖము లోపల అంతయు ఆవర్తములుగ దొలువబడి తాటాకు మందమున మాత్రమే యున్నందున అతి తేలికయై, నఖాగ్రము మీద మోపు చేయబడి ఉన్నది. శంఖములోనికి ఒకపుల్ల జొనిపినచో అది ఆవర్తములగుండా పోజాలి యుండును. స్వామివారు కూర్చున్న రూపములో యున్నారు. అయినా అంత ఎత్తునయున్నా అంత గంభీరముగ నున్న విగ్రహమును దక్షిణావనిలో ఎచ్చటనూ గానరాము. ఈ గాంభీర్యానికి వన్నె యిచ్చు చందంబున కర్ణాభరణములు, కర్ణశష్కులములు, తాటాకు మందమున మాత్రమే వెలుగొందుచూ అతి మనోహరముగా ఉండును. నాభియావర్తము, యురమున హారములు, యజ్ఞోపవీతము, వళిత్రయము, వస్త్రములు అలలువలె ముచ్చట గొల్పుచూ అతి రమణీయముగ ఉండును. ఇలాగే పాదములకు గల రాజలాంఛనమైన ధ్వజారవిందాది శుభరేఖలు దిద్ది ఉన్నాయి. నఖాగ్రముకూడా విస్పష్టంగా గోచరిస్తూ ఉంటుంది. ముఖ్యంగా కుడి బొటనవ్రేలిపై గల శంఖంలోని శిల్పసంపద

ఈ ప్రాంతములో ఎచ్చటనూ గానరాదు. ఈ శిల్పసంపద అత్యంత ప్రాచీనమై శాలివాహనుల నాటిది అని ఆధునిక శిల్పకళావేత్తలు పలువురు తమ అభిప్రాయము తెలిపియుచ్చిరి.

## శాతవాహనుల కాలంలో స్వామివారి వైభవము

శాతవాహనుల కాలంలో భీమనది వరకు విస్తరించి విరాజిల్లిన ముత్తేవి క్షేత్రములో శ్రీ లక్ష్మీపతి స్వామివారు ప్రభావితమై యున్నారు. శాతవాహనులు ఆంధ్రులేననియు వీరు 27 లేక 30 మంది పరంపర గల్గిన చక్రవర్తులనియు, 450 సంవత్సరములు దక్కన్ భూమిని పాలించిరనియు మత్స్య, వాయుపురాణములలో పేర్కొనబడి యున్నది. క్రీస్తుకు పూర్వం 270 వ సంవత్సరము లగాయితు క్రీస్తు పిమ్మట 178 సంవత్సరముల వరకు శాతవాహన చక్రవర్తులు ఈ ప్రాంతాన్ని పాలించినట్లు చరిత్ర పరిశోధకులు తెలియపరచియుండిరి. ఈ ప్రాంతపు దండకారణ్యాన్ని ఈ చక్రవర్తులు, ఛేదించి వాసయోగ్యంగా చేసినట్లు విజ్ఞాన సర్వస్వము మూడవసంపుటి తెలుగు సంస్కృతిలో ప్రకటితమై యున్నది. ఇందువల్ల కృష్ణానదియు, సముద్రమున్నూ మార్గములు మార్చుకొని ప్రవహించసాగినవి. ఈ మార్పు ముఖ్యంగా శ్రీకాకుళము, పెదముత్తేవి, ఘంటసాల ప్రదేశములలో స్పష్టంగా, గోచరించుచున్నది. క్రీస్తుశక, తొలిశతాబ్దంలో "కంటకసేల" అను

పేరుతో ప్రముఖ రేవుపట్టణంగా విరాజిల్లిన ఘంటసాల, ప్రవాహము మార్పువల్ల, సముద్రమునకు దూరమైపోగా శ్రీకాకుళంలోని ఆలయము రెండుమారులు కృష్ణానదీ గర్భస్థము అయి, మూడవ ప్రతిష్ట నేడున్న ప్రాంతములో జరిగినట్లున్నూ చరిత్ర పరిశోధకులు వెల్లడించిరి. ఇలాగే చెంతనేగల ముక్తేవి క్షేత్రముకూడ కొంతకాలమునకు భీమనదికి దూరమై ఒక అగ్రహారంగా మారిపోయినది.

శాతవాహన చక్రవర్తులలో 17 వ వాడైన హాలుడు తాను రచించిన గాథాసప్తశతి కథల సంపుటిలో ఆనాటి దేవళములన్నియు దారువుతో నిర్మింపబడి యుండెనని వ్రోని యున్నందున ఆ చక్రవర్తులు ఈ క్షేత్రములోని ఆలయమును కూడా దారువులచే నిర్మించియుండిరి. అందువల్ల బహుకాలం ఈ ఆలయం మన్నలేదు. అయినా ఇట్టి స్థితిలోనే స్వామివారు భీమనదీ ప్రాంతమునందే, తూర్పు చాళుక్యుల కాలంవరకు పూజల నందుకొనుచూ వుండిరి.

## చాళుక్య చక్రవర్తి విష్ణువర్ధనునిచే ద్వితీయప్రతిష్ఠ

చాళుక్య చక్రవర్తులు ఈ ప్రాంతాన్ని క్రీ. శ. 1022 లగాయతు 1063 వరకు పాలించిరి. వీరిలో విష్ణువర్ధనుడు వైష్ణవమతావలంబి. ఈయన స్వామివారి పూజాదికములు గ్రామానికి దూరంగా కొనసాగించుటలో కష్టమును గుర్తించి స్వామివారిని నేటి పేరంరాజు చెరువుప్రాంతముకు గొనితెచ్చి

అచ్చట ప్రతిష్ఠించిరి. వీరి పిమ్మట పాలించిన వీరివంశీకులెల్లరూ శైవులగుటచే, వారికాలంలో ఈ ఆలయంలో వినాయకుని ప్రతిష్ఠించిరి. ముణగవిజయాదిత్యుని సాతులూరి శాసనములో ఇట్టి వినాయక విగ్రహము పేర్కొనబడి యున్నందున ఇచ్చట గల వినాయకుని ఈ చక్రవర్తులే ప్రతిష్ఠించినట్లు నిర్ణయించుట మైనది.

చాళుక్య చక్రవర్తుల పిమ్మట చాళుక్య చోళసామంతులను ఓడించిన అనంతదండనాయకుడు కృష్ణాతీరంలోగల పలు ఆలయములను క్రీ. శ. 1118 – 1120 మధ్యప్రాంతములో పోషించి అభివృద్ధి పర్చినట్లు చేబ్రోలు, కొమ్మూరు శాసనముల వల్ల విదితమగుచున్నది. ఈ దండనాయకుడు ఈ క్షేత్రము చెంతనేగల శ్రీకాకుళక్షేత్రమునున్నూ ఈ క్షేత్రములోని స్వామివారి ఆలయమునున్నూ అభివృద్ధి పర్చియుండెను. వీరి పిమ్మట కాకతీయ చక్రవర్తులపాలన కడపటిసంవత్సరములలో అనగా 12 వ శతాబ్దిలో ఈ ఆలయము ఉచ్ఛస్థితిలో నున్నట్లు ఆధారములు కన్పించుచున్నవి. కాకతీయుల కాలంలో శ్రీకాకుళము తిరునాళ్లు ప్రసిద్ధిగాంచినట్లు క్రీడాభిరామంలో వర్ణించబడియుండెను. ఆంధ్రదేశంలో 12వ శతాబ్దిలో వైష్ణవము బాగా వ్యాప్తిలోనికి వచ్చినట్లున్నూ సింహాచలము, బాపట్ల, శ్రీకూర్మంలోని విష్ణాలయములు ఈ కాలంలో బాగా పూజలు అందుకొనినట్లున్నూ ఆళ్వారుల విగ్రహములు కూడా తొలిగా

ఈ కాలంలోనే విష్ణాలయములలో ప్రతిష్ఠించటము జరిగిన దనియు సుప్రసిద్ధ చరిత్ర పరిశోధకులు కీ. శే. మల్లంపల్లి సోమశేఖరశర్మగారు నుడివియున్నారు. ఆంధ్రదేశంలోని ప్రసిద్ధ ఆలయములతోపాటు ఈ క్షేత్రంలో కూడా ఆనాటి స్థానిక విష్ణుభక్తులు, ఆరు ఆళ్వారుల విగ్రహములనున్నూ ప్రసన్న ఆంజనేయుల విగ్రహమున్నూ ప్రతిష్ఠించి యుండిరి. క్రీ. శ. 1300 సంవత్సరమునకు చెందిన మంచెన తాను రచించిన కేయూరబాహు చరిత్రలో ఈ ప్రాంతముల రథోత్సవముల వైభవములను విపులముగా వర్ణించియున్నందున ఈ క్షేత్రం 12 వ శతాబ్దినుంచి కాకతీయుల పతనంవరకు అత్యంత వైభవముగా వెలుగొందినట్లు స్పష్టబడుచున్నది.

కాకతీయ సామ్రాజ్యపతనానంతరం క్రీ. శ. 1324 లగాయతు 1360 వరకు ఆంధ్రదేశంలో ముస్లిముల భీభత్సం అతిదారుణముగా కొనసాగినది. వీరు ఆంధ్రదేశంలోని పలు దేవాలయములను పడగొట్టి అందుపై మసీదులు నిర్మించిరి. తుగ్లక్ కుమారుడు ఉలుమ్‌ఖాన్ ఓరుగల్లులో క్రీ. శ. 1324 లో అధికారిగా నియమితుడు అయినప్పుడు అతను గావించిన పైశాచిక కృత్యములకు అంతులేదు. ప్రోలయనాయకుని శాసనములు ఈ విషయములను స్పష్టపర్చుచున్నవి. ఇంతేగాదు. క్రీ. శ. 1650-1700 సంవత్సరమునకు చెందిన వెంకటాధ్వరి కూడా తన "విశ్వగుణాదర్శనము"లో ఈ ఆటవిక ప్రవృత్తులను

విపులముగా ఖండించి యున్నాడు. ఇలా నేలకూల్చబడిన ఆలయములలో ఈ క్షేత్రములోని శ్రీ లక్ష్మీపతిస్వామివారి ఆలయము కూడా ఒకటి. ఈ సంఘటన కాకతీయ రాజ్యపతనానంతరమున్నూ రెడ్డి రాజ్యపాలన పూర్వమున్నూ జరిగినది.

## పేరంరాజుచే మూడవ ప్రతిష్ఠ

ఆ పిమ్మట స్వామివారు తమ పరివారంతో 17 వ శతాబ్ది ప్రారంభమువరకు నేడు పేరంరాజు చెరువు గల ప్రాంతములోనే దాగియుండిరి. క్రీ. శ. 1620 సంవత్సరములో ఈ క్షేత్రంలో నివసించియున్న ముత్తేవి పేరంరాజు అను పెరుమాళ్ళయ్యగారు పొద్దుగ్రుంకిన తరుణంలో గృహోన్ముఖుడై ఆ బాటను ఏతెంచుచుండగా స్వామివారు భూమిలో దాగియున్న ప్రాంతమునకు వారు రాగానే వారి పాదమునకు ఒక రాయి ఎదురు దెబ్బతగిలెను. తనవలెనే, ఇతర బాటసారులకు ఆరాయి దెబ్బతగుల గలదని భావించి, తన చేతి కర్రతో త్రవ్వగా ఇంకా లోతుగా వుంది. పెద్ద రాయిగా కాన్పించెను. అప్పటికే చీకటి పడినందున, తన ప్రయత్నము విరమించి గృహమునకు ఏతెంచెను ఆ రాత్రి పేరంరాజుగారికి శ్రీలక్ష్మీపతి స్వామివారు స్వప్నంలో సాక్షాత్కరించి, ఆ రాయి క్రింద తానున్నాననియు, తనను గొనితెచ్చి గ్రామమధ్యమున ప్రతిష్ఠించమనియు ఆనతిచ్చిరి. మరునాడు తనస్వప్నవృత్తాంతము గ్రామస్థులకు తెలియజేసి అచ్చట త్రవ్వించూచిరి. ఆ ప్రదేశంలో

రాజ్యలక్ష్మీసమేతులైన శ్రీలక్ష్మీపతి స్వామివారు, ప్రసన్న ఆంజనేయులు, వినాయకులు విగ్రహములున్నూ బండ్ల రామిరెడ్డి, ఈ చింతయ్య, ఈ రామయ్య, కాటూరి భాస్కరయ్య అనువారలు సమర్పించిన నల్గురు ఆళ్వారుల విగ్రహములున్నూ, సమర్పించిన వారల నామధేయములు లేకుండా రెండు ఆళ్వారుల విగ్రహములున్నూ బయల్పడెను. విగ్రహములు గాంచినంతనే ఆ మహాభక్తుడు మహదానందముతో తన్మయుడై మైమరచి, సంతోషస్వాంతుడై యుండగా, గ్రామస్థులు చక్కగా అలంకరించిన బండికి బలిష్ఠమైన ఎడ్లను గట్టి గొనితెచ్చిరి. విగ్రహములు అందుంచి ఎంత పెనుగులాడినను బండి కదులలేదు. వారి నిగ్రహాగాంచి, పేరంరాజు తన పాతబండికి కష్టే తన ముసలి ఎడ్లను కట్టించి, ఈ విగ్రహములు అందుంచి, తానే సారథియై త్రోలగా ఎడ్లు బిరబిరకదిలి నడిచెను.

విగ్రహములను తన గృహంలో ఒక ప్రత్యేక స్థలములో నుంచి, తనకు పెన్నిధి దొరికినదని ప్రజలకు చెప్పుచూ సంతోషముతో ఓలలాడుచుండెను. కేదారి అను దాయాది వాస్తవముగనే ధనము దొరికినదని భావించి అసూయాగ్రస్తుడై చెంతనే కోనూరులో మకాంచేసియున్న తాలూకా మహమ్మదీయ అధికారితో తన సోదరునకు ధనము దొరికినదనియు, ఆయనను ఖైదుచేసి ఆ ధనమును స్వాధీనపరుచుకోవలసినదనియు ఫిర్యాదు చేసెను. ఆ అధికారి దొరికిన ధనముతో సహా హాజరు

కావలసినదిగా పెరుమాళ్లయ్యగారికి హుకుమ్ జారీచేసెను. పేరంరాజు ఈ ఇక్కట్టుకు తాళలేక స్వామివారిని ప్రార్థించి తనకు లభ్యమైన విగ్రహములలో వినాయక విగ్రహము ఒక వస్త్రములో చుట్టి, అధికారి వద్దకు వచ్చి ఇట్టిరూపములో గల విగ్రహములు మాత్రమే లభించినవనియు, ధనమేమియు దొరకలేదనియు తెలియపర్చిరి. అధికారి వీరి పలుకులు విశ్వసించక, ఉగ్రుడై, ఆయనను శిక్షించుటకై తన ఒరలో నున్న ఖడ్గమును తీయబోగా, అది ఆ అధికారి బొటనవ్రేలునే ఖండించెను. ఈ సంఘటనపట్ల ఆశ్చర్యపడి పెరుమాళ్ళయ్యగారి భక్తిప్రపత్తులను గ్రహించినవాడై విగ్రహముల ప్రతిష్ఠకై కొంతధనము యిచ్చి పరివారముతో సాగనంపెను. పేరంరాజు ఆ ధనముతో గర్భాలయ, అంతరాలయములను నిర్మించి గర్భాలయములో మూలవులను, అంతరాలయము వామ పార్శ్వపు లోపలి గోడలో హనుమంతుని ప్రతిష్ఠించిరి. ఆతరుణములోనే తాము ప్రత్యేకముగా సమర్పించిన నిజరూపుబోలి శేషపాన్పు మీద కూర్చున్న రూపములో అమ్మవారితో వేంచేసియున్న స్వామివారు, చక్రపెరుమాళ్లు, కణ్ణన్ అను మరొక విగ్రహము మొత్తము మూడు తామ్రవిగ్రహములను గర్భాలయములో ఉంచిరి. ఉత్సవాదులకున్నూ నిత్యము భక్తులు సేవించుటకున్నూ ఉపయోగపడుటకొరకుగాను ప్రత్యేకముగా స్వామివారి విగ్రహములు తామ్రముతో చేయించి, వాటిని అంతరాలయములో వామ పార్శ్వమున సమర్పించి, కుడి

పార్శ్వమున ఆ ఉత్సవుల పవళింపుకై నిలువుటద్దములతో అమర్చిన పవళింపు పాన్పును ఏర్పాటు చేయించిరి. వినాయకుని మహిమవల్లనే ఆలయ నిర్మాణమునకు ధనము లభ్యమైనందున సిద్ధివినాయకుడు క్షేత్రపాలకుడుగా వెలుగొందుచందమున అంతరాలయము దక్షిణపువైపు గోడలో వెలుపలను ప్రతిష్ఠించిరి. ఈ రీత్యా, భక్తులు, ప్రదక్షిణకాలంలో తొలిగానే వినాయకునకు స్వయంగా పూజలు సమర్పించుకొనుటకు అవకాశము కలుగజేసిరి. ఈ వైభవోపేత ప్రతిష్ఠా మహోత్సవ కార్యక్రమము 1620 సం॥రములో గ్రామ మధ్యభాగంలో నేటి ప్రదేశములో పేరంరాజుగారు జరిపించిరి. స్వామివారితో లభ్యమైన ఆళ్వారుల విగ్రహములను ప్రతిష్ఠించుటకై స్థలము కుశలమైనందున ఉత్తరోత్తరా ప్రత్యేకముగా ఉపాలయము కట్టించి అందులో ఈవిగ్రహములను దివ్యదేశ సాంప్రదాయక్రతువుతో స్థాపనామహోత్సవము జరుపనెంచి, అంతదనుక వాటిని అంతరాలయములో ఒకచో భద్రపర్చిరి. వీరిసంకల్పము 1963 లో శ్రీ సీతారామ యతీంద్రులవారు నెరవేర్చిరి.

స్వామివారు లభ్యమైన పరమపవిత్ర ప్రదేశములో ఒకతటాకమును త్రవ్వించి, గ్రామములోని నీటిఎద్దడిని కూడా నివారించిరి. ఆ తటాకము నేటికిన్నీ పేరంరాజు చెరువు అని పిలువబడుచున్నది. ఈ తటాకము దేవాలయము వెనుక భాగమున ఆలయ సమీపములోనే గలదు. లక్ష్మీదేవిపతి

అయిన రామచంద్రమూర్తి ఉనికినిబట్టి ఈ క్షేత్రమునకు రామఖండ్రిక అను నామధేయము ఏర్పర్చిరి.

## స్వామివారికి పేరంరాజు ఈనాం సంపాదించుట

మహాభక్తుడైన పేరంరాజు ఈ క్షేత్రములో నివసించిన కాలములో ఢిల్లీలో మొగలాయిల పాలన కొనసాగుచుండెను. తెలుగుదేశములో గోల్కొండను రాజధానిగా చేసుకొని కుతుబ్‌షాహి వంశీకులు పాలించుచుండిరి. వీరు పరిష్యానుంచి విచ్చేసిన తురుష్క విదేశీయులైనను ఆంధ్ర సంస్కృతి, విజ్ఞానాభివృద్ధికి తోడ్పడుటే గాక పలు దేవాలయములకు భూములు దానముచేసిరి. ఈ వంశీకులలో ఆరవ వాడైన సుల్తాన్ మహమ్మద్ కుతుబ్‌షా పలువురు పండితులను, కవులను తన సంస్థానమునకు ఆహ్వానించి వారిని ఘనంగా సన్మానించిరి. ఈ సుల్తాన్ తన అధికారులద్వారా కోనూరులో జరిగిన సంఘటన విని మహాభక్తుడైన పెరుమాళ్లయ్యగారిని 1686 సం॥రములో తన సంస్థానమునకు పిలిపించి, వారిని ఘనంగా సన్మానించి, పిమ్మట వారి అభీష్టము తెలియపర్చుమని సుల్తాన్ అడుగగా, తన ఇలవేల్పుఅయిన లక్ష్మీపతిస్వామి ధూపదీప నైవేద్యములకు శాశ్వతమైన ఏర్పాటు చేయించమని తనకోరిక వెలిబుచ్చిరి. వెంటనే సుల్తాన్ నేటి పెనుముత్తేవి గ్రామంలో ఏకఖండముగా నున్న యీ 58-83 సెంట్ల భూమిని స్వామివారి ధూపదీప నైవేద్యముల కొరకు సమర్పించిరి. ఈ భూమియే

నేడు స్వామి వారికి ముఖ్యరాబడియై సాలీనా రు. 50,000 ఆదాయము గొని తెచ్చుచున్నది.

లక్ష్మీపతి స్వామివారిని ప్రతిష్ఠించిన వేరంరాజు సంస్కృతము, ఆంధ్ర భాషలలో దిగ్దంతులైన పండితోత్తములు. పలువురకు విద్యాదానము చేసియుండిరి. విద్యాదాన గ్రహీతలలో ఒక భట్టుమూర్తి తంజావూర్ సామ్రాట్ విజయరాఘవ నాయకునకు తన వామహస్తముతో కైవారము చేయగా, ఆయన కారణమడుగ, తన కుడి హస్తమును విద్యాదానము చేసిన గురువునకు అర్పణ చేసితినని చెప్పగా గురువు మాహాత్మ్యం తెలిసికొనగోరి భట్రాజును నిర్బంధించెను. వేరంరాజు తన శిష్యుని అవస్థ తెలుసుకొని క్రీ. శ. 1640లో తంజావూరు వేంచేసి, ఆ సామ్రాట్టును ఒక శపథములో ఓడించి ఆయన మన్ననలను పొందిరి. ఈ ఘట్టము తంజావూరి నాయకరాజుల చరిత్రలో సువర్ణాక్షరములతో లిఖింపబడియున్నది. ఇలాగే వీరు తమ యాత్రలలో పలుప్రదేశములలో దిగ్విజయము సాధించిరి. వీరు 1590 లో జన్మించి 1680 లో పరమపదించిరి. వీరు చెంతనేగల మొవ్వలోని క్షేత్రయ్య సమకాలికులు. వీరి కాలములో ఈ క్షేత్రము అజరామరమైన ఖ్యాతిగాంచినది. దేశాటనలో వీరు ఆర్జించిన ధనముతో స్వామివారికి పలురకములైన ఆభరణములు చేయించి సమర్పించిరి. వీరు ఆదిలో నియోగి బ్రాహ్మణులు. వీరికి నలుగురు పుత్రులు

జన్మించిన పిమ్మట జ్యేష్ఠ పుత్రుడు రామభద్రుడుతో కలిసి వీరు వైష్ణవిష్టి పొందగా మిగిలినవారు నియోగులుగానేవుండి పోయిరి. అలగాయితు వీరు పెరుమాళ్లయ్య అను నామధేయ ముతో వ్యవహరింపబడిరి. వీరి తదనంతరము వీరి జ్యేష్ఠకుమారు డైన రామభద్రునికి కల్గిన వైష్ణవ సంతతివారు వంశపారంపర్యా ఆలయపాలన నిర్వహించిరి.

## స్వామివారికి పేరంరాజు వైష్ణవ సంతతి సేవలు

18 వ శతాబ్దినాటికి ఈ క్షేత్రము పెదముత్తేవి, చిన ముత్తేవి అను రెండు గ్రామములుగా ఏర్పడినది. ఈ క్షేత్ర ములో పేరంరాజు వైష్ణవ సంతతిలోని, పేరంరాజుగారి, మునిమనమలు అయిన పెరుమాళ్లయ్య, రామయ్య అను ఇరువురు భక్తశిఖామణులు నివసించియుండిరి. ఆనాడు ఆంధ్ర దేశపరిస్థితులు అల్లకల్లోలముగ ఉండెను. సలాబత్ జంగ్ మీాద నిజామల్లీ తిరుగుబాటు చేసి నిజాం సంస్థానము అధిష్టించగా అంతవరకు నిజామ్‌కు లోబడివున్న ఫౌజుదారులు,జమీాందారులు నిజాముకు ఎదురు తిరిగి సర్వస్వతంత్రులుగ వ్యవహరింప మొదలిడిరి. ఈ అదను గమనించి ఈ ప్రాంతములోని పలు తావులలో, తురకలు, పిండారీలు చెలరేగి పలు ఆలయములను దోచుకొనగా పరగణాలలోని పెత్తందార్లు విజృంభించి ప్రజలను పీడించి ధనమును అపహరింపసాగిరి. ఆనాటి గోగులపాటి కూర్మనాథకవి తన నరసింహా శతకములోనూ, భల్లా పేరకవి

తన భద్రగిరి శతకములోనూ ఈ ప్రాంత ప్రజల ఇక్కట్లను విపులముగా వర్ణించియుండిరి.

ఇలా పాశవిక ప్రవర్తన పరాకాష్ఠ నందుకొన్న దినములలో సుసంపన్నంగా ఉన్న చల్లపల్లి కోటను వశపరచుకొనుటకై నిజామ్ నవాబు, నిజామల్లీ తన కాల్బలముతో 1760 సం॥రములో వెడలిరాగా, సంస్థానాధిపతి అయిన కోదండ రామన్న దేశాయి విజ్ఞప్తిపై ఈ క్షేత్రములోని పెరుమాళ్లయ్య గారు శ్రీకాకుళములోని హనుమంతుని సూరు పద్యములతో స్తుతించి, ఆ దండుపై పిడుగులు కురిపించగా, భయోత్పాదముతో వారు వెనుతిర్గి పరుగిడిరి. సంస్థానాధిపతి దేశాయి సంతోషస్వాంతుడై పెరుమాళ్లయ్యగారి అమేయమైన ప్రజ్ఞా ప్రాభవములను కొనియాడి, వారి కోరికపై లక్ష్మీపతిస్వామి వారి ఆలయమునకు ధ్వజదండాదులను నిర్మించిరి.

ఈ తరుణములోనే గుడివాడ పరగణా పెత్తందారు అయిన అచ్చయ్యగారు శివమెత్తిపోయి ఈ ప్రాంతప్రజలను పలువిధములుగా పీడించుచూ, ఈ క్షేత్రము వచ్చి పెరుమాళ్లయ్యగారి సోదరుడు అయిన రామయ్యగారిని పలు హింసలకు గురిచేసెను. మహాభక్తుడే గాక మంత్రవేత్తకూడా అయిన రామయ్యగారు ఈ క్షేత్రములోని గంగానమ్మను ఆవాహన చేసి, వికృతరూపము ధరించి అచ్చయ్యవద్దకు వెళ్లి భయపెట్టి రావలసినదిగా ఆజ్ఞనివ్వగా, ఆమెను చూచి భయపడి అచ్చయ్య

పెరుమాళ్లయ్యగారిని శరణుజొచ్చెను. ఇలా అచ్చయ్యకు శృంగభంగముచేసి లోకోత్తరకృషి చేసినందుకు రామయ్య గారిని ప్రజలు ఘనంగా సన్మానించిరి. ఆ కానుకలతో రామయ్య గారు శ్రీ లక్ష్మీపతిస్వామివారి దేవాలయమునకు విమానము కట్టించి చక్రప్రతిష్ఠ చేసిరి. ఆపిమ్మట పేరంరాజు నిర్మించిన తటాకమును, విస్తృతపర్చి తద్వారా భక్తుల స్నానపానాదులకున్నూ, స్వామివారి తీర్థబిందెకు వినియోగపడునట్లు చేసిరి.

ఆ పిమ్మట 1850 లో రామయ్యగారి మనమలలో రామభద్రయ్యగారు ధ్వజ స్తంభము చేయించి ప్రతిష్ఠించగా, 1859 లో సీతాపతిగారు ఈనాము కమీషనరువల్ల స్వామి వారికి పేరంరాజుగారు సంపాదించిన యీ 58-38 సెంట్లకు 12-9-1859 తేదీన పట్టా సంపాదించిరి. అప్పట్లో ఈ భూమి నుండి హెచ్చు ఫలసాయము రానందున, అప్పటి పేరంరాజు వంశీకులు, అర్చకులకు ఈ భూమి వశముచేసి, దానిలోని రాబడితో, స్వామివారికి ధూప దీప నైవేద్యములు నెర వేర్చుచూ తమ కుటుంబమునను పోషించుకోవలసినదిగా కట్టడి చేసిరి. కాని రామభద్రయ్యగారి కుమారుడు శ్రీరామాచార్యులు గారి తరమువచ్చునప్పటికి అర్చకులు తమ విధ్యుక్త ధర్మములు సరిగా నెరవేర్చనందున, వారి స్వాధీనములోనున్న భూమిని స్వామివారికి చెందించుటకుగాను బందరు సబుకోర్టులో ఓ. యస్. 7/15 నెంబరున తమజ్ఞాతులైన సీతారామానుజా

చార్యులు, శోభనాద్రాచార్యులు గారల ద్వారా శ్రీరామా చార్యులుగారు దావా వేయించి విజయము సాధించిరి. ఆ దావా ఖర్చులు అన్నియు శ్రీ రామాచార్యులుగారే భరించిరి. కోర్టు వారు అర్చకులకు నెలవారీ జీతము ఏర్పాటుచేయుమనియు, అప్పటి అర్చకులైన సీతారామా చార్యులు, లక్ష్మణాచార్యులు, కృష్ణమా చార్యులు గారల స్వాధీనములోనున్న స్వామివారి య48-83 సెంట్లను స్వామివారి వశముచేయుమనియు ఇచ్చిన తీర్పు ఫలితముగా ఆ పద్ధతియే నేడుకొనసాగు చున్నది.

పేరంరాజు త్రవ్వించిన తటాకము పరంపరగా వారి కుటుంబీకులు, భక్తులకున్నూ స్వామివారి తీర్థబిందెకూ వినియోగ పడునట్లు 1952 సం॥రము వరకు పాలన కొనసాగించిరి. ఆ పిమ్మట పరిసర ప్రాంత తటాకములతో పాటు ఈ చెరువుకూడా రెవిన్యూపాలనలోకి వచ్చి నేడు స్థానిక పంచాయితీ ఆధ్వర్య ములో నున్నది.

శ్రీరామాచార్యులుగారి కుమార్తు అయిన సీతారామ యతీంద్రులవారు రెండవసారిగా స్వామివారి ఆలయములో శిఖరప్రతిష్ఠ గావించిరి. పేరంరాజు కాలమునుండియు ఆలయము లోని ఆళ్వారుల విగ్రహములకు దివ్యదేశపడికట్టు ననుసరించి పూజా పునస్కారములులేక మరుగుపడియున్నందున వీరు పలు వ్యయ ప్రయాసలకు లోనై 1963 లో దివ్యదేశము జరిపించిరి. ఆ సందర్భములో యతీంద్రులవారున్నూ వారి

శిష్యులున్నూ నూతన ఆళ్వారుల విగ్రహములను సమర్పించి ఆ మహోత్సవము వైభవముగా జరిపించిరి. ఈ క్షేత్రములో విద్యా సౌకర్యములేని కొరతను నివారించుటకై 10 వేల రూప్యములు వీరు స్వయంగా వెచ్చించి ఓరియంటల్ హైస్కూలు స్థాపించి 1,2 ఫారములవరకు నిర్వహించి పిమ్మట దాని నిర్వహణ బాధ్యతను శ్రీలక్ష్మీపతిస్వామివారి దేవాలయమునకు ఒప్పగించిరి. శ్రీవారు భక్తి ప్రచారముకొరకు నిరంతరము దేశాటన జరుపుచున్ననూ ఇచ్చటకు ఉత్సవముల తరుణములో విచ్చేసి తమ మృదుమధుర సంకీర్తనము భక్తులకు లభింపజేసి ప్రజాహృదయమును చూరగొని యున్నారు.

వీరితండ్రిగారు శ్రీరామాచార్యులుగారు కొంతకాలము, పిమ్మట వీరు కొంతకాలము, ఆలయమునకు ట్రస్టీలుగా నియమింపబడినప్పుడు వీరి పెత్తండ్రియు ఈ గ్రంథకర్త తండ్రియున్నూ అయిన లక్ష్మీనరసింహాచార్యులుగారి సహాయ సహకారములతో ఆలయములో మేడ, ముఖమండపము, ఉపాలయములు మొదలగు భారీకట్టడములు నిర్మించుటే గాక తమపదవులను ప్రజానురంజకముగా నిర్వహించిరి. వీరి ట్రస్టీ పాలన కాలములో ప్రజాహృదయమును చూరగొను తిరునాళ్ల వైభవ కార్యక్రమాలు తొలిగా అమలుపర్చినందున ఆ లగాయతు సాలీనాజరుగు బ్రహ్మోత్సవములకు ఒక విశిష్టత చేకూరి ప్రజలు తండోపతండములుగా విచ్చేసి పాల్గొను

చున్నారు. వీరు యతి ఆశ్రమం స్వీకరించ నున్నందున వీరి ట్రస్టీపదవి గడువు ముగియక పూర్వమే రాజీనామా ఇచ్చిరి.

## సదాచారములు

ఆలయ పరిపాలన ఆదిలో పేరంరాజు వైష్ణవసంతతివారు, ఆ పిమ్మట బందరు సబుకోర్టువారు నిర్వహించిరి. నేడు ప్రభుత్వ దేవాదాయ ధర్మాదాయ డిపార్టుమెంటువారు పాలించు చున్నారు. వీరందరు అనాదినుంచి పేరంరాజుగారికి కలిగిన వైష్ణవ సంతతికి గల హక్కులను పాటించుచున్నారు. సాలీనా జరుగు బ్రహ్మోత్సవ తరుణములో వీరు పీటలమీద కూర్చొని కళ్యాణము జరుపు సదాచారము తరతరాలుగా కొనసాగించ బడుచున్నది. కళ్యాణము దినమున అమ్మవారిని కళ్యాణము జరిపించు వారి గృహమునకు గొనితెచ్చి అచ్చటనుంచి పేరంరాజు కుటుంబీకులు అందరూ మట్టెలు, మంగళసూత్ర ములతో అమ్మవారిని ఆలయమునకు గొనితెచ్చి కళ్యాణ మంటపములో జరుపు వైదిక కార్యక్రమమంతా కళ్యాణము జరుపువారిద్వారానే జరిపించు సదాచారము కూడా కొన సాగింపబడుచున్నది. కళ్యాణము ముగిసిన పిమ్మట గరుడోత్స వముతో పేరంరాజు వంశీకులలో కళ్యాణము జరుపువారి గృహమునకు స్వామివారిని వేంచేపుచేయించి అచ్చటనే తీర్థప్రసాదములు వినియోగము చేయుదురు. ఆ దినములలో జరుగు దొంగలదోపు ఉత్సవము కనుల పండువుగా పేరంరాజు

సంతతివారి ఇంటివద్దనే జరుపబడుచున్నది. ప్రభుత్వ డిపార్టు మెంటు వారు ఈ సదాచారముల నన్నింటినీ మన్నించుటతో పాటు వేదంరాజు గారి వంశీకులలో శ్రీ సీతారామయతీంద్రుల వారిని తొలిగా ఆలయ స్థానాచార్యులుగాను, వీరి పిమ్మట పూర్వాశ్రమంలో వీరి ద్వితీయకుమారుడు లక్ష్మణదాసు (లక్ష్మణ యతీంద్రులు) గారిని స్థానాచార్యులుగాను, వంశపారం పర్యా ట్రస్టీగాను నియమించి భక్తుల ప్రశంసలను చూరగొనిరి.

## పరిపాలనా నిర్వహణ

1916 వ సం॥రములో బందరు సబుకోర్టువారు ఆలయ నిర్వహణకొరకు తొలిగా ఒకస్కీము ఏర్పర్చి ఏకట్రస్టీ పాలన ప్రవేశపెట్టిరి. 1969 వ సంవత్సరములో ప్రభుత్వ దేవాదాయ ధర్మాదాయ డిపార్టుమెంటువారు తొలిగా ఎగ్జిక్యూటివ్ ఆఫీసరును నియమించువరకు ఈ సదాచారమే అమలులో నుండెను. షుమారు 2 సంవత్సరములు ట్రస్టీ ఎవరూలేకుండా ఆఫీసరుపాలనే కొనసాగి 1971 సంవత్సరము నుండియు ట్రస్టు బోర్డు ఏర్పడి పరిపాలన నిర్వహించుచున్నది. స్కీములగాయతు ఈ దిగువవారు ఆలయట్రస్టీలుగా దేవాలయ పాలన కొన సాగించిరి.

వేమూరి రామచంద్రరావు పంతులుగారు
బి. ఏ., బి. యల్. (బందరు)

ది 15- 4-1916 నుంచి 30- 4-1925 వరకు 9 సంవత్సరములు;
ము త్తేవి శ్రీరామాచార్యులుగారు
ది 1- 5-1925 నుంచి 24- 4-1927 వరకు 2 సం॥రములు;
సీతారామ యతీంద్రులవారు పూర్వాశ్రమములో
ము త్తేవి సీతారామానుజాచార్యులుగారు
ది 2- 5-27 నుంచి 20-9-29 వరకు 2 సం॥రములు;
విశ్వనాథ సర్వేశ్వరరావుగారు, బి.ఏ.బి.యల్(బందరు)
ది 21- 9-29 నుంచి 20-9-32 వరకు 3 సం॥రములు;
కాకర్ల వెంకటరత్నంగారు
ది 21-9-32 నుంచి 14-10-41 వరకు 9 సం॥రములు;
అద్దెపల్లి కోటయ్యగారు
ది 15-10-41 నుంచి 15-12-47 వరకు 6 సం॥రములు;
కాకర్ల కాకుళస్వామిగారు
ది 16-12-47 లగాయతు 15-12-53 వరకు 6 సం॥రములు;
నర్రా వెంకటరత్నంగారు
ది 12-1-54 నుంచి 20-7-69 వరకు 15 సం॥రములు;
ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు పాలన
ది 21-7-69 లగాయతు 28-3-71 వరకు;
ది 29-1-71 లగాయతు 29-4-73 వరకు సర్వశ్రీ
(1) నర్రా వెంకటరత్నం (చైర్మన్)
(2) ముత్తేవి శ్రీరంగాచార్యులు (ఈ గ్రంథ రచయిత)

(3) యం. టి. వి. రాఘవాచార్యులు
(4) మన్నే వెంకటసుబ్బారావు
(5) మురారి నాంచారయ్య
(6) మహాళీ రామరాజు
(7) లింగమనేని వెంకటేశ్వరరావు గారలు

నాన్ హెరిడిటరీట్రస్టీలుగా అధికారములోనికి వచ్చిరి. పిమ్మట వీరిలో ఏడవవారైన లింగమనేని వెంకటేశ్వరరావుగారు రాజీనామా చేయగా ఆ రాజీనామా 13-12-71 తేదీనుంచి అమలులోనికి వచ్చి వారి స్థానే కె. యస్. వి.పి.వి. దేవేంద్రరావు గారు 20-2-72 తేదీన నియమింపబడిరి. ఆ పిమ్మట ది 8-4-72 తేదీలగాయతు వంశపారంపర్యట్రస్టీగా శ్రీముత్తేవిలక్ష్మణదాసు (లక్ష్మణ యతీంద్రులు) నియమింపబడిరి. ఈరీత్యా నేడు ఆలయపాలన ఏడుగురు నాన్ హెరిడిటరీట్రస్టీల, ఒక హెరిడిటరీ ట్రస్టీ మొత్తం ఎనిమిది ట్రస్టీల ఆధిపత్యమున కొనసాగు చున్నది. 1973 అక్టోబరు 31 న తేదీన శ్రీసీతారామ యతీంద్రులవారు పరమపదించిన పిమ్మట లక్ష్మణ యతీంద్రుల వారు స్థానాచార్యుల పదవి కూడా నిర్వహించుచున్నారు.

## ముఖ్యమైన ఉత్సవములు

ఇచ్చట జరుగు ఉత్సవములలో ధనుర్మాస, అధ్యయన, బ్రహ్మోత్సవములు కనుల పండువుగ నిర్వహింపబడుచున్నవి.

ధనుర్మాసము మార్గళిలో నెలదినములు అత్యంత వైభవముగ జరుగును. ప్రతినిత్యము ఆండాళ్ మహాతల్లిని ఊరేగించి, ఆఖరిదినమైన భోగిపండుగ రోజున కళ్యాణముచేసి ముగింపు చేయుదురు. ఫాల్గుణ బహుళపంచమి లగాయతు దశమిరోజు ఉదయమువరకు అధ్యయన ఉత్సవములు విష్ణుభక్తుల గోష్ఠితో ముచ్చటగా జరుగును. అయిదవనాటి రాత్రి శంగోలంనాడు, జరుపుక్రతువు శోభాయమానంగా ఉండును. చైత్రశుద్ధ ఏకాదశిలగాయతు తొమ్మిది రోజులు బ్రహ్మోత్సవము జరుగును. ఈ దినములలో నిత్యము జరుగు హరికథలు, పాటకచేరీలు, నాటకములు మొదలగు కార్యక్రమములలో వేనకు వేలు ప్రజలు పాల్గొందురు. ఈ దినములలో స్వామి వారికి చేయు వివిధరకముల అలంకారములు ప్రజలనుముగ్ధులను చేయును.

## ము గిం పు

బందరుకు ఈ క్షేత్రము 12 మైళ్ళున్నూ విజయవాడకు 36 మైళ్ళదూరములోనూ గలదు. బందరునుంచి కూచిపూడి ఆర్. టి. సి. బస్సుమార్గములో చినముత్తేవి వద్ద దిగి రెండు మైళ్ళు రావలసి వుంటుంది. ఈ క్షేత్రములో శ్రీసీతారామ యతీంద్రులవారిచే స్థాపించబడిన శ్రీకృష్ణాశ్రమము, శ్రీవారు నిర్మించుచు సిద్ధిపొందుటచే వారి పిమ్మట శ్రీవారి ముముక్షుజన

మహాపీఠమును అధిష్టించిన శ్రీ లక్ష్మణయతీంద్రులవారిచే పునః ప్రతిష్ఠగావింపబడిన వైకుంఠనాథాలయము కూడా గలవు.

ఈ క్షేత్రము సినీ ప్రపంచాన్ని కూడా ఆకర్షించినది. స్వర్గీయ గూడవల్లి రామబ్రహ్మంగారి దర్శకత్వమున వెలువడిన రైతుబిడ్డ చిత్రములో కొన్నిఘట్టములు ఇచ్చట తీసి ఆ చిత్రానికి రూపురేఖలు దిద్ది ప్రదర్శించి యున్నారు. ప్రఖ్యాత చలనచిత్ర దర్శకుడు, గాయకులు అయిన శ్రీ ఘంటసాల వెంకటేశ్వరరావుగారు 17శతాబ్దిలో ఈక్షేత్రములో జన్మించిన పెరుమాళ్ళయ్యగారు భద్రాద్రిలో సింధు గోదావరిలోనున్న విష్వక్సేనుడను పిలుచుటకై వ్రాసిన పద్యములలోని "మరచుట లేదు మీ స్మరణ......" అను పద్యమును "భక్తరఘునాథ్" అను చిత్రములో ఆలపించి ప్రజానీకాన్ని భక్తి పారవశ్యములో ముంచెత్తిరి.

ఇలా ఈ క్షేత్రము వైకుంఠవాసి శ్రీ లక్ష్మీపతి ఉనికినిబట్టి తరతరాలుగా ఐహిక, ఆధ్యాత్మిక సంపత్తికి నిలయమై వెలుగొందుచున్నది.

సర్వేజనా స్సుఖినో భవంతు

ఓం శాన్తి శ్శాన్తి శ్శాంతిః